# గోలకొండపత్రిక

స్వభాను సం॥ర కార్తీక శు॥ ౭ గురువారము

## రైతులకు దెబ్బ

హైద్రాబాదు ప్రభుత్వమువారు నగరాలలో పట్టణాలలో ఏర్పాటుచేయనున్న తిండి కొలత యొక్క సంబంధములో కొన్ని కొత్త శాసనాలు కొన్నిదినాలలోనే చేయనున్నారని సోమవారమునాడు గౌ॥ ఖూరాకాఖామంత్రిగారు పత్రికాధిపతుల కిచ్చిన యుపన్యాసములో స్పష్టమైనది. మేము గతసంచికలోనే రేషన్ మనదేశానికి సరిపడదని అభిప్రాయమిచ్చియుంటిమి. మరునాడే పత్రికలలో డాక్టరు ఎ. ఐ. ఖురేషీగారి యుపన్యాసము ముద్రితమైనది. అందు వారిట్లన్నారు: "మనదేశములో భుక్తికి లోపము కలుగుటకు ముఖ్యకారణము వ్యాగనులు తక్కువై ఒకచోటనుండి మరియొకచోటికి ధాన్యం తొందరగా రవానాకాకపోవుట ధాన్యం కంట్రోలు కాని రేషనింగుకాని ఈసమస్యను పరిష్కరించజాలవు." ఇందుమించు మేము ఏఅభిప్రాయము నిచ్చియుంటిమో అర్థశాస్త్రనిపుణులుకూడా అదే అభిప్రాయమిచ్చినారు వ్యాగనులు చాలాలోపించియుండుట, వ్యాపారము స్తంభించిపోవుట, ధాన్యము తొందరగా కదలకుండుట ఒక ముఖ్యకారణనున్నది ముఖ్యముగా గమనింపవలెను

"గతసంవత్సరము బెంగాలులో పంటలు బాగా పండెను. జనుముతక్కువై వరిపంటయే యెక్కువగా పండెను" అని ప్రొఫెసరుగారన్నారు అట్లైతే బెంగాలులో వేలకొలదిమంది ప్రతివారం ఎందుకనిచస్తున్నారు? అమెరీ మంత్రిగారు అన్నట్లుగా ఎక్కువ తిని చస్తున్నారా? ఎక్కువ తింటున్నారనేవాదము చాలా చిత్రమైనవాదము. ధనికులైనవారు ఎక్కువ తింటున్నారు అని కొత్తగా అమెరీవాదాన్ని సమర్థించుట మొదలైనది ధనికులు సాధారణముగా యుద్ధానికి పూర్వముకూడా ఎక్కువగానే తింటూ ఉండినారేమో? మనదేశములో పెద్దపొట్టలు, స్థూల్యముకలవారు ధనికులేగాని బీదవారుకారు. ఏనుగుకాళ్లు అనురోగమువచ్చినవారే బీదలలో ఒల్లినవారు అట్టి వారలకు యుద్ధము వచ్చినతరువాత ఇంకాయెక్కువ తినవలెనని ఎందుకు సంకల్పము కలిగెను? వారిని యుద్ధములో భర్తీ చేస్తారు. అందు చావకతప్పదు. కావున ఇక్కడనే తిన్నచావుతప్పదు అని తర్కించుకొన్నారా? లేదు. మరి యెక్కువగా తింటే మొదలే పెద్దగా కాగుడవలె పెరిగిన పొట్టలు రబ్బరుతిత్తులవలె ఊదెక్కి పగిలిపోవా? అజీర్ణరోగాలు యెక్కువై డాక్టర్లకు ఫీసులిచ్చుకోవలసి వచ్చునుకదా! డాక్టర్లను తమవిధముగాలను గ్రహించినట్లులేదు ఈయూసు నాళ్లేదనుండి వినియుండలేదు అట్లైతే బెంగాలులో బీదలంతా కడుపులుబ్బకొని దొంగచావులు చస్తున్నారా? లేదు నిజమైనచావులే చస్తున్నారని ఫొటోలు వేసిన ముస్లిం అజుమనువారు కాల్చివేసిన హిందూ అనాధప్రేత సంస్కారములున్నూ దినదినము ఏరుగుల లెక్కలుపట్టిలను ప్రకటించుచున్నారు 'అట్లైతే బెంగాలులోనివారు ఎందుకు చస్తున్నారు? వారికి చావులంటే టాకీకిపోయినట్లే వినోదమా? మన అర్థశాస్త్రజ్ఞులగు ఖురేషీ గారేమన్నారో వినండి, "మతపాక్షిక పరిస్థితి, సట్టావ్యాపారాలు, బీదలపోషీడీలు, అనేవే ఈనాటి బెంగాలు ఘోరస్థితికి కారణాలు" అని వారు సెలవిచ్చినారు. రేషనుకు ముఖ్యప్రతిబంధకాలలో మతపాక్షికము ఒకటికాగలదు అని మేమున్నూ గతసంపాదకీయములో వ్రాసినాము. ప్రొఫెసరుగారు మతపాక్షికానికి భుక్తికి యేమిసంబంధమో తెలుపలేదు. మేమున్నూ వివరించలేదు. వారు వివరించిననాడు మేమున్నూ తము వివరించకుండా ఉంటాము

ఏదిఏమైనున్నా రేషన్ హైదరాబాదులోని పట్టణాలకు రానున్నదనుటలో సందేహములేదు. అదివస్తేవచ్చెనుగాని దాని నిప్పిలలో రైతులకు పెద్దదెబ్బ తగులబోతున్నది. అది అన్యాయపుమంటివాక్యము. రైతులకుఅయ్యే ఖర్చులుతగ్గలేదు ఇనుముధర తగ్గినదా? పత్తిధర తగ్గినట్లుగా తగ్గినదా? రైతుల బట్టలధర అంత గా తగ్గినదా? పత్తికి చాలాతగ్గుదల అయ్యెను. బట్ట ఒకటి అట్లుకాలేదు. మందుల మాకుల ధరలు తగ్గినవా? ప్రతివస్తువుధరకూడా పెరుగుతూనేఉండగా రైతులపంటల ధరలలో మొదటినుండి కంట్రోలుమూలాన తగ్గించుటనేజచ్చినారు కదా! అంతటితోతృప్తినొందక యిప్పుడు ప్రత్యేకముగా రైతుల పంటలధరలన్నిపూర్తిగాతగ్గించివేయుచున్నారు

"తెల్లజొన్నలు హైదరాబాదులో రూపాయికి ౬ సేర్ల ప్రకారం అమ్మేటట్లుగా చేస్తాము."

అని గౌ. ఖూరాకాఖా మంత్రిగారు సెలవిచ్చినారు. అనగా పల్లాకు ౨౦ రూ. ధర ఇప్పుడు పల్లెలలో ౨౭ నుండి ౩౦ రూపాయలవరకు ధరకలదు మంత్రిగారి శాసనము ప్రకారము పల్లెలలో తెల్లజొన్నలకు ౧౮ రూ. వరకు పల్లా ఒకటింటికి ధరయేర్పడును. ఇది తెల్లజొన్నలకు ఇక భునాసజొన్నలకు ధర మరీ తక్కువఅని అర్థము పైగా మొక్కజొన్నలకు, సజ్జలకు మొనాపలీ ఇప్పుడు న్నారట. అంటే మరీతక్కువధర ఏర్పడును. మొనాపలీ యేర్పడితే రాష్ట్రంలోని రైతులు తమ తిండికై రైతులవద్ద కొనరావన్నమాటయేనా? ఒకవేళ అంతగా రొట్టెలమై (గటక) అంబలిపై బుద్ధి పుట్టితే మొనాపలీపొందిన హై. క. కార్పొరేషన్ వారిని ప్రాధేయపడి, బహుశా సెలవుచిట్టీపొంది కొనవలసినదేనా? రైతులకు ఇప్పుడు జొన్నలకేధరపల్లెలలో దొరుకుతుందో (అనగా ౨౭ రూపాయలు పల్లా ౧కి) అంతకు మించి తక్కువధరఎంతవరకుఇనుమున్నాగు వాటిధరలుతగ్గవో అంతవరకు ఏర్పాటు కాగూడదు ఈసంవత్సరమే పొగాకు పన్నుపర్చెను దానిదెబ్బ అప్పుడేరైతులకు చూపించినది పలుతావుల రైతులు పొగాకు మొక్కలు లాగివేసి చేలనుచెడబాపి వేరే ధాన్యం విత్తినారని వార్తలు వచ్చినవి. ఇకముందు సంవత్సరం వ్యాపారిపంటలు అనగా వేరుసెనగ,పత్తి, ఆముదాలు, నీలి మున్నగునవి చాలాతగ్గించి వేయవలెనని శాసించనున్నారని మాకు రూఢిగా తెలిసినది. ఇన్ని చిక్కులలో రైతు కోలుకోగలడా? రైతులకు పంటలధరలు భాగావస్తున్నవికదాఅను ప్రవాదము బలీయమైపోయినది. జమాఖర్చు లెక్కలనుచేసి అడావాపట్టితేచేసేవరకు రైతులకు యెప్పటివలెనే అయిపోయింది. యల్లయ్య గొంగడి వేసినచోటనేఉండి అన్నట్లయిపోయింది. ఎందుకంటారా? రైతులు జీతగాండ్రకు జీతాలుమూడంతలిచ్చుచున్నారు. ఎద్దులను మూడు నాల్గంతల ధరలు పెట్టికొంటున్నారు. ఇనుమువంటి ధరలు. బట్టలునాల్గంతలు. మందులు నాల్గంతలు ఏదిక్కువెళ్ళినా నాల్గంతలు అయిదంతలు. ఇక రైతులకేమి మిగులుతుంది. వ్యవసాయంచేసినప్పుడే తెలుస్తుంది కచ్చేరీలో కాగితాలమీద లెక్కకట్టినప్పుడే లెక్కలు తప్పిపోతూనే ఉంటవి. ధరలకథయిట్లున్నది.

ఇకధాన్యం కథవినండి. గౌ. ఖూరాకాఖామంత్రిగారు పత్రికాసంఘమువారికిట్లుసన్వసించినారు.

"రైతులు తాము పండించిన ధాన్యములో ఒకభాగం సర్కారువారికి ఇచ్చివేయవలెను. మరాట్వాడ, కర్నాటకు సూబాలలో ప్రతి ఎకరానికి ఒక మణుము ఖుష్కీగింజలను కొలిచి పెట్టవలెను. తెలంగాణా ఖుష్కీ నూలునుండి ప్రతి ఎకరానికి అర్థమణుము గింజలు కొలిచి పెట్టవలెను. పైగా తెలంగాణాలో రైతులు తరీఖ్యామునుండి ప్రత్యేకముగా ఒకడు మణుముల వడ్లు కాని ఒక మణుము బియ్యంకాని కొలిచి పెట్టవలెను."

మణుమంటే రైల్వే మణుమేనేమో అనగా ౪౦ సేర్లు అన్న మాట. ఇది చాలాకారిన్యమనటకు హేతువగును. రైతులకు నిజముగా మిగిలినట్లయినప్రభుత్వమునకు బజారుధర ప్రకారము ఇచ్చి కొనుటకు ఏమాత్రమును సందేహముండదు. కాని పైయొజ్జప్రకారము పలుతావుల అసంభవమేర్పడును తెలంగాణాచెలకలు చాలాప్రసిద్ధిమైనవి వాటియేడుపు చూచియే ప్రభుత్వమువారు కూడా ఎకరానికి ౬ అణాలపన్ను ఏర్పాటుచేసినారు. వాటిలో ధాన్యం కంటే ఎక్కువగా గడ్డియే సమృద్ధిగా పండును వాటిలో రాళ్ళేయెక్కువ. అవి ఇసుకయెడారులు. ఆ ఎడారులలో వాగులువంపులుచెట్లుచేమలు అట్టిచెలకల లోపంటపండుట అరుదు. కొన్నికొన్ని మారులు ౩౦ ఎకరాలలో ౨౦ సేర్లగింజలు కూడాపండవు. ఈయేడుమాత్రము పండినవనా? ౨ నెలలు వర్షములేక సగము మాడెను. ౨ నెలలు ఘోరవర్షములో మిగతసగము మురిగెను. పైగా పురుగు పట్టెను, సగటున నాల్గుకొలలపంట గట్టిగా పండినది. ఏదోధర ఎక్కువగా ఉంది కదా అదేనిండుపంట అనుకొందామనే అని రైతులు కలలుకన్నారు. ఇప్పుడు ధరకంట్రోలు అనుటచేత అదికూడా ఎగిరిపోయినవి. తెలంగాణారైతు అర్ధ మణుము (అంటే ౨౦ సేర్లు అనుకొందాము) ప్రతిఎకరానుండి ఎక్కడినుండి పుట్టించి కొలిచిపెట్టవలెను? ఎకరాకు ౫ సేర్లనుండి ౧౨ సేర్లు సగటున పంట ఈయేడుపండినదని మాకు తెలిసినది. రైతులు తమపంటలు నిజమైన లెక్కలు వివిలిగా బయటపెట్టితే యిదధర్మము తెలియగలదు. లేదా ప్రభుత్వమువారు రైతులుమాపిన ౫ నంబర్లు తామువసం చుచేసి ౫ నంబర్ల సమానపైకొల్యాములనటీకోని కొతలుకోయించి సగటుతో కట్టితే తెలిపోతుంది. అట్టి కొద్దిపంటలో సర్కారువారుకోరే ఎకరా ౨౦ సేర్లకంటే తక్కువపంట పండితేరైతు ఎక్కడనుంచి సరిపెట్టగలడు. రేపటి నుండియే (కాదుకాదు ఇదివరకేమొదలైనది) పల్లెలకు సేటెద్దార్లు, గిర్దావర్లు, పేష్కార్లు, తహసీల్దార్లు వెళ్ళి రైతుల నుండి ఖరాబునామాలున్నాయించుకొందురు సరి రైతులలోని ఆచార ప్రకారము విత్తనానికి నాగులు తెచ్చి యుండిరి. నాగులయ్యల కేమియిచ్చుకొంటారు? పైగా రైతులు ఎప్పటివన్నూ సాహుకార్లపై జీవించేవారు, పంటకళ్లమైననాడే నేరుగా సాహుకార్ల యిండ్లకు తమచాలీబాబతు ధాన్యం మోసివేస్తారు మరునాటినుంచి మళ్లీ కళ్లము నాటివరకు సాహుకారియే వారిసంసారం నడిపించేవాడు! ఈసంగతి మన అధికారుల కేమితెలుసు? రైతులకు సంవత్సరానికి కుటుంబానికగు తిండిబత్తెం, బెల్లముని ఉప్పు, జీలకర్ర, కూరగాయలు పండ్లు మున్నగునవి కొనుటకై ధాన్యం, పశువులదాణా, గ్రాసగాండ్లకు ధాన్యరూపముగా ఇచ్చేజీతం ధాన్యం, ఆయముగింజలు, విత్తనాలు సంవత్సరంపొడుపునాకలుపు, సేద్యంకూలి, పెంటలఖరీదుకు, ప్రతిసేద్యంఖర్చుకు అయ్యేకూలిగింజలు ఇట్టివాటికంతా ధాన్యం నిలువయుండవలెకదా! ఈసంగతి అధికార్లకు తెలుసునోలేదో! మన రాష్ట్రములో వ్యవసాయదారులైన తాలూకాదారులు మందుకైనాలేరు, సూబేదార్లు అంతకులేరు. తహసీల్దారులలో నూటికి ౫౦ మందికికూడా వ్యవసాయం లేనివారే ఉన్నారు. ఇట్టివారికి వ్యవసాయంలో ఉండేకష్టాలు ఆచారవ్యవహారాలేమి తెలియును రైతులకు సంవత్సరం సేద్యంఖర్చులకు, విత్తనానికి, ఇంటితిండిఖర్చులకు యింకావసరాలకు అయ్యే ధాన్యం మొదటపక్కకు పెట్టవలెను ఆటుపిమ్మట మిగిలిన ధాన్యమును సర్కారు లక్షణముగా తీసికొనవచ్చును. కాని ధరల కంట్రోలు చేయవద్దండి. లేదా అన్నింటికి అనగా పశువులధరలకు ఇనుమునకు, మందులకు, అన్నింటికి మొదలు కంట్రోలుచేసి తర్వాత రైతులధాన్యం కంట్రోలుచేయండి. రైతులు కళ్లంచేసిన తర్వాత ఎంతపండినదో అది కొలిచి దానిలో వారికి నిజమైన అవసరాలకు ఎంతకావలెనో అవి మిగిలించి మిగిలినవాటిలో కొంతభాగమును ప్రభుత్వమువారు కొనుట సరియగు పద్ధతి. ప్రభుత్వమువారు రైతులమైదయకలిగియుండినట్టివారు. మాప్రియమైనప్రజలు అని వారెప్పుడున్నూ అంటారు. అట్టి ప్రియమైనప్రజలలో రైతులు ప్రియతమమైన ప్రజలు. గౌరవింపతగినవారు. ఎన్నడున్నూ ప్రతిఘటించియెరుగరు. కష్టాలు వస్తే వందలకొలదిగా గొంగళ్లతోపట్టుమువచ్చి సాష్టాంగ దండాలతో ప్రభూ అనుగ్రహించండి, అని అతిదీనముగా ప్రాధేయపడినట్టివారు. అట్టి కష్టజీవుల పొట్టపై కొట్టరాదు. ౨౦ ఏండ్లనుండి ధరలులేక చచ్చి తప్పిన రైతుకు రెండేండ్లనుంచి ధరలు కలిగేవరకే అప్పుడే కంట్రోలా? దయచేసి శాంతముగా ఆలోచించండి. కనికరించండి. పునరాలోచించండి.

## విజ్ఞానవర్ధని

### ఇటీదాండు.

ఈపేరు మనకుకొత్తది. కాని ఈఆటమనదే అనగా ఆంధ్రులదే. గిల్లిదండ, చిల్లగోన మున్నగు పేరులతో ఆమనట్టికటను బహుశా మొట్టమొదట తెనుగువారే కనిపెట్టినారేమోఅని యీ విజ్ఞానవర్ధనమునందే వ్రాసియుంటిని. క్రికెటుఆటకు బాటచూపినది ఈయాటయే. ఈయాటను మరాటీలో ఇటీదాండుఅని యందురు మరాటీబాలురు ఈయాటను ఆడునప్పుడు శాముతో కొలుచునప్పుడు మరాటీ సంఖ్యలతో ఎంచక వకట్,రేండ్.మూండ్. అని తెనుగుబంట్లతో కొలుతురు, పదివరకు తెనుగుబంట్లతోనే వారువ్యవహరింతురు. "ఈఆటతోసాటిగా ఈబంట్లను మరాటీలు తెనుగువారినుండి గ్రహించి కేవలము ఈఆటకొరకే యీపట్లమువాడుదురు" అని గుణేఅను మరాటీభాషా శాస్త్రపండితుడు వ్రాసినాడు

### అభినవకచుడు

అక్బరుచక్రవర్తి వేదాలలోఏమున్నదో అవంతాచెప్పండిఅని బ్రాహ్మణులను విచారించెను. కాని ఎవ్వరున్నూ చెప్పకపోయిరి తుదకు ఫైజీఅను తురకబాలునికి బ్రాహ్మణవేషము వేసిబ్రాహ్మణులను పిలిచి ఇదిగోఇతడు అనాథబ్రాహ్మణవటువు.వీనినిమీరుపెంచండి.మీకుప్రతిఫలమిత్తునుఅని వారికిచ్చెను. కాశీలో ఒకపండితుడు వానినిపెంచి గంపెడ్లపాటు సంస్కృతమువేదములు వానికి బోధించెను.వాడు చురుకుకలవాడగుటచేతొందరగా అన్నియునేర్చుకొనెను. పండితుడు వాని తెలివికిసంతోషించి స్వతంత్రాలు కానున్న తనబిడ్డనువానికిచ్చి పెండ్లిచేయుటకుసిద్ధపడెను. ఫైజీ సంస్కృతంచదువుకొన్నదియునుగురుద్రోహము మితిమీరిపోతుందని గ్రహించి గురువులకాళ్ళపైబడి తనపేరు,మతము,తనదీక్ష, అన్నీ తెలిపెను.గురువు ఆగ్రహోదగ్రుడై వానినిచంపదలచినవాడై మరలశాంతించి "అయినదేమోఅయినది నీవు వేదాధ్యయనముకాని మామతగ్రంథాలుకాని పరభాషలలోనికి పరివర్తనముచేయనని ప్రతిజ్ఞచేయుము. ఇదే నాగురుదక్షిణ" అని అన్నాడు. చిత్తమనివాడట్లేచేసినాడు. కచదేవయానికథ ఒకవిధముగా అక్బరు కాలములో మరొకరూపముగా సంభవించెను!

### పెండ్లినియమము

పూర్వము ప్రపంచములో మానవులు పశువులవలె స్వేచ్ఛగా భోగించుచుండిరి. వివాహమనునది జరుగకుండెను గ్రీసు దేశములో క్రీ పూ. ౨౦౦౦లో కెక్రాప్సు (Cecrops) అనువాడు వివాహపద్ధతిని ప్రవేశపెట్టెను. జ్యూ(యూదు)లలో వివాహమును మోసెస్ ప్రవక్త ప్రవేశపెట్టెను. కానిఅప్పటికిన్నీ యూదులచుట్టునూ ఉన్నట్టి మిడియనీ, మోవబిజాతులవారిలో (Midianites, Moabites) స్త్రీపురుషులు ఇష్టమువచ్చినట్లుగా సంభోగించుచుండిరి ఈజిప్టు దేశములోనైతే ఎంచుచూలేనట్టి కామచారము ప్రబలియుండెను. అప్పటి ప్రాదేవాలయములలో నగ్నదేవతలు బంధనాలు, ప్రముఖదేవతల అసహ్యచర్యలున్నియు రాతిలో విగ్రహాలుగా చెక్కబడియుండెను. అతికామమువలన స్వేచ్ఛాచారమువలన ఈజిప్టులో ఇస్యూ (Issue)అని బైబిల్ లో పేర్కొనబడిన సుఖరోగము మొంటి ప్రబలిపోయెను ఈజిప్టునుంచి జ్యూలనురక్షించి తీసుకొనివచ్చిన మోసెస్. తన జాతిలో ఇకముందు స్వేచ్ఛాకామచారిత్వము లేకుండచేసి వివాహపద్ధతినినిర్ణయించి పై "ఇస్యూరోగము" ను అరికట్టెను.

## భార్యలు భర్తలను తల్లిదండ్రులు శిశువులను వదలుట

బెంగాలురాష్ట్రములో జరుగుచున్న ఘోరపరిస్థితినిగురించి పండిత హృదయనాథ కుంజ్రుగారు ఒకప్రకటనచేసినారు.—

"ఎక్కడబట్టినను చెప్పితే నమ్మలేనంత దుర వస్థయున్నది. పట్టణాలలోను, గ్రామాలలోను తిండిలేక మాడుటయే ప్రజలగతిగానున్నది. పట్టణాలకంటె గ్రామాలస్థితి ఇంకనుదుర్భరముగానున్నది. గ్రామప్రజలయొక్క ముఖ్యముగా స్త్రీలయొక్కయు శిశువులయొక్కయు బాధలువిన్నచో ఎవరుగాని కంటతడిపెట్టకుండరు. భార్యలు భర్తలనువదలుటయు, తల్లిదండ్రులు శిశువులను వదలుటయు ఎక్కువయగుచున్నది. చిన్నకర్షకులును, సొంతయాస్తికలిగి కూలివారలును అన్నము కొరకై తమభూములను ఇండ్లను అమ్మివేసికొనుచున్నారు నారాయణగంజులో మకాణములలో తిండిలేక మాడుచున్న గ్రామజనులు అమ్ముకొని తరుగుడిసెల పైకప్పులకుపయోగించిన టీనురేకులచూడవచ్చును. ఈవిధముగా గృహభ్రష్టులైన జనులు ఆహారమునకై పట్టణములకు ఎగబ్రాకి గంజికేంద్రప్రదేశములను చేరుకొనుచున్నారు. దీనివల్ల కర్షకులు ధాన్యాలను దాచుకొనుచున్నారని, అతినిరుపైవేసిన అపవాదము చెల్లదని రుజువుకాగలదు. తిండిలేక మాడుచున్న గ్రామజనులు ధాన్యమునుఅమ్మకుండ దాచుకొనుచున్నారని ఆక్షేపించుట చాల క్రూరమైనది.

